Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

B15

శ్రీః

# శ్రీ భువనవిజయము

## చరిత్రాత్మక సాహిత్య నాటిక




రచయిత : ఆముజాల నరశింహమూర్తి

హిందీ ప్రచారక్ : తోలేరు.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC LIBRARIES: ANDHRA PRADESH, HYDERABAD

Rc. No. 11–A3/64 Dt. 9–4–'64

Sub:– Books and Publications-Book entitle "Kanna Kuthuru" "Sarvodayam" and "Sri Bhakta Ranjani" Commendation of Orders Issued.

Read :– Letter dt 1–1–'64 from Sri A. Narasimha Murty, Hindi Pandit, Z.P.H.S. Ungutur West Godavari Dt.

ii) L. Dis. No. 2–D2/'64, dt 21–3–'64 from the Principal, Govt. Training College, Rajahmundry.

The following books are commended for use in all the Public Libraries in the State

| Name of Books | Name of Author | Price: |
|---|---|---|
| 1) Kannakuthuru | A. Narasimha Murty | Rs. 2–00 |
| 2) Sarvodayam | do | Re. 1–50 |
| 3) Sri Bhakta Ranjani | do | Re 1–00 |

The undermentioned officers are requested to bring the above mentioned books to the notice of the heads of all Public Libraries under their jurisdition.

K. Raghava Reddy
For Director of Public Libraries

/ True copy / forwarded / by order /

Sd.
SUPERINTENDENT.

To

The Libraries in the State.

The Secretaries of L. L. As in the State

Copy forwarded to Amujala Narasimha Murty, Hindi Pracharak, Toleru (Post) Bhimavaram Tq.

Copy to 'B' Section, Record–5 Copies, Spare–5 Copies, MGR

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

శ్రీః

# శ్రీ భువనవిజయము

## చరిత్రాత్మక సాహిత్య నాటిక




రచయిత : ఆముజాల నరశింహమూర్తి

హిందీ ప్రచాంక్ : తో లే రు.

సర్వస్వామ్యసంకలితము వెల · 1-00

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

# మనవి.

పాఠక మహాశయులారా!

నాయీసాహిత్యనాటికాకృతిభర్తృత్వమున కంగీకరించి ముద్రణకగు వ్యయము భరించి తమకృతిభర్తృత్వమును సార్థకముఁ జేసికొనిన శ్రీశ్రీ యఱ్ఱా చంద్రిరావుగారికి ప్రథమ ప్రదర్శనమునఁ బర్యవేక్షణ ధూర్వహులగు శ్రీశ్రీ పసల సూర్యచంద్రరావుగారికి, దర్శకులై నాటికా ప్రదర్శనమునకు వలయు నేర్పాట్లు చేయించిన శ్రీ నిమ్మల కృష్ణమూర్తి యఱ్ఱా చంద్రియ్యగారలకు, కవిసన్మాన కర్తలగు శ్రీ యఱ్ఱా నారాయణస్వామి బెల్లంకొండ శ్రీరాములుగారలకు, నాటికనామూలాగ్రముగాఁ దిలకించి పరిష్కరించిన మద్గురు వరేణ్యులగు శ్రీ గంధం శ్రీరామమూర్తిగారికి, తిమ్మరుసు పాత్రానకర్తలగుటయేకాక నాయీనాటిక కాశీస్సందేశము నొసఁగిన శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారికి, కావ్యకథా సారాంశముల నందఁజేసిన యష్టదిగ్గజానుకర్తలకు, భువనవిజయ సభా చిత్రపటముతోఁబాటు కళావైశిష్ట్యవ్యాసము నిచ్చిన శ్రీనాగమల్లి రాధాకృష్ణగారికి నాటికాప్రదర్శనముఁ జూచి, విని, యానందించి యాశీర్వదించిన నాటిసభాసదులకు, సకాలములో ముద్రణముఁ జేయించి యిచ్చిన శ్రీరమాప్రింటర్సు ప్రొప్రయిటరు గారికి నాభక్తిపూర్వక నమోవాకములు.

విధేయుఁడు

ఆముజాల నరసింహమూర్తి

హిందీప్రచారక్, తోలేరు

భీమవరం తాలూకా. ప॥ గో॥ జిల్లా.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

కృతిభర్త:



శ్రీ శ్రీ యురాల్ల చంద్రరావుగారు,

( వదాన్యశేఖరులు. )

ఉప్పలూరు.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

శ్రీః

# శ్రీ భు వ న వి జ య సా హి త్య నా టి కా

## : కృ తి భ ర్తృ ప్ర శ ం స :

(1)

శ్రీమహిళా కళత్రుఁడయి చెన్నిల రాజుచు నుప్పులూరు స
ద్గ్రామము నందు భక్తజన కాంక్షలఁ దీర్చెడు చెన్న కేశవ
స్వామికృపైకభూమియయి సంతతమున్ నినుఁబ్రోచుఁగావుతన్
ప్రేమను చందిరాయ పృథివీరమణా! నిజవంశభూషణా!

(2)

భాగ్యశాలియగు సబ్బారాయ సమభిద
ఖ్యాత చరితుఁడు నీకన్నతండ్రి
ఆదర్శమహిళ వెంకాయమ్మసాధ్వి, జ
గన్నుత చరిత నీకన్న తల్లి
భూరి యశస్కుండు నారాయణస్వామి
పేరిటి దిట్ట నీపెద్దయన్న
గంభీర హృదయుండు ఘనుఁడు సూర్యారావు
శీలభాసితుఁడు నీచిన్నయన్న

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

2

వారిపేరు ప్రతిష్ఠ లవ్వారి గాగ
నిలుపఁ జాలిన యత్యంత నిపుణ మతివి
పండిత విధేయ! స్పృహనీయ భాగధేయ!
సర్వహిత నామధేయ! శ్రీచంద్ర రాయ!

3

శ్రీల ప్రజాళికిన్ ముదము సేయుచు భీమవరంబునన్ గళా
శాలకు నుప్పలూరుపురి స్థానగతోన్నత పాఠశాలకున్
జాలిన యంత సాయమును సల్పియు నండగ నిల్చి సత్కళా
లోలత సార్థకాఖ్యను వెలుంగఁగఁ జాలితి చంద్రభూవరా!

4

భావస్ఫూర్తియు సద్యశోభిరుచియున్ బ్రఖ్యాత ధర్మక్రియా
ప్రావీణ్యంబును గల్గి జన్మమది సార్థక్యంబుఁ జెందన్ సుధీ
సేవా తత్పరతన్ మెలంగుదు భవచ్చిత్తంబు దాత్తంబు య
ద్రావంశాఖ్య గభీరవారినిధి చంద్రా! చంద్రరాయ ప్రభూ!

5

శ్రీభువన విజయ సభకున్
వైభవ మెసఁగంగ నాధిపత్యముఁ గొని, యిం
ద్రాభ మహారాజస్కుఁడవై
ప్రాభవమును గంటి చంద్రరాయ మహీంద్రా!

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

# శ్రీ భువన విజయము

(చరిత్రాత్మక సాహిత్యనాటిక)

శ్రీ యర్రా చంద్రరాయమూర్తికవి
సన్మానసందర్భమున ప్రదర్శితము

పర్యవేక్షకులు : శ్రీశ్రీ పసలి సూర్యచంద్రరావుగారు,
(సంగీతనాటక అకాడమీ అధ్యక్షులు)

అనుకార్యులు — అనుకర్తలు

1 శ్రీకృష్ణదేవరాయలు :- శ్రీ యర్రా చంద్రరావుగారు (వదాన్యశేఖరులు)

2 తిమ్మరుసు : జమ్మలమడక మాధవరామశర్మగారు (అభినవభారతి, లాక్షణికశిరోమణి)

3 రాజగురువులు : గోనెల్ల రామమూర్తిగారు (ఏ. ఓ. యల్.)

4 అల్లసానిపెద్దనకవి : గంధం శ్రీరామమూర్తిగారు ("విద్వత్కవిరాజ")

5 నందితిమ్మనకవి : జ ధ్యాల పాపయ్యశాస్త్రిగారు (కరుణశ్రీ)

6 ధూర్జటికవి : గోనెల్ల రామమూర్తిగారు (గాయకశిరోమణి)

7 అయ్యలరాజురామభద్రకవి : ఇట్టింకి నరసింహమూర్తిగారు

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



8 తెనాలిరామకృష్ణకవి : వారణాసి గంగాధరశాస్త్రిగారు

9 పింగళసూరనకవి : గంధం నాగేశ్వరరావుగారు

(సీనియర్ తెలుగుపండిత్)

10 రామరాజభూషణకవి : అమ్మిశెట్టి లక్ష్మయ్యగారు (పోషకవి)

11 కందుకూరిరుద్రకవి : గంధం భోగేశ్వరరావుగారు

(సీనియర్ తెలుగు పండిత్)

12 ఆస్థాన చిత్రకారులు............

13 వైతాళికుడు : అముజాల నరసింహమూర్తిగారు (కృతికర్త)

దర్శకులు : నిమ్మల కృష్ణమూర్తిగారు
యర్రా చంద్రయ్యగారు

కవిసన్మానకర్తలు : యర్రా నారాయణస్వామిగారు (బెనర్జి)
బెల్లంకొండ శ్రీరాములుగారు (బాబూరావు)

## ప్రార్థన

జై! జై! మహాంధ్ర జననీ!
జై! జై! మదాంధ్ర జననీ!

1 గీర్వాణాధిప కీర్తిత సద్గుణి! సర్వదేశ సంతత శుభకాంక్షిణి
స్థైర్యథైర్య సౌజన్య కుటుంబిని గర్వరహిత సత్కార్య కారిణి! ॥జై జై॥

2 కవిపండిత గాయక నటీనటక చయ నిరంతరోత్పత్తి విధాయినీ!
భయవిహీన సద్భావశాలిని! నయగామిని! పుణ్యతీర్థ పావనీ ॥జై జై॥

3 సంతత మృదుకల ప్రసన్నభాషిణీ! కాంతికలిత దినదిశా శోభినీ!
శాంతిదాయినీ! ధర్మపరాయణి! దాంతివిరాజిత శుభ్రసుహాసిని!

జై! జై! మహాంధ్ర జననీ!
జై! జై! మదాంధ్ర జననీ!

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

# శ్రీ భువనవిజయము

## (చరిత్రాత్మక సాహిత్యనాటిక)

(శ్రీకృష్ణదేవ రాయలవారి భువనవిజయ సభామండపము, నానాదేశాగత సామంత మంత్రి పురోహిత కవిపండితధానుష్క సుశోభితమై యుండును)

వైతా : (ప్రవేశించిప్రమోదభరితాంతరంగుడై )అప్పుడే సుముహూర్తము సమీపించి నట్లున్నది అరుగో! రాజగురువు లేతెంచుచున్నారు (ఎదురేగి) అమోఘాశీః పరిరక్షిత భూమండలా ,

రాజబిడౌజుఁడై యెసఁగి రాయలచేత యథార్హ రీతులన్
బూజలఁ గొంచు, నాత్మహిత బోధలు సేయుచు నేర్మి పేర్మిన
వ్యాజ ఋజుప్రవృత్తి ననయంబు జరించుచు నుండునట్టి యో
రాజగురూత్తమా! యిటుల రండిదె గద్దె నలంకరింపుడీ!

(పీఠ నిర్దేశము జేయును)

రాజ : (ప్రవేశించి సభాభవనము నంతనుగలయఁజూచి ఆశీః పూర్వకముగా) "సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై తేజస్వినా వధీతమస్తు మావిద్విషావహై ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః"

(అని స్వపీఠమలంకరించును)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



వై తా : (తిమ్మరుసురాకను గమనించిచూచి) అరుగో హిందు సామ్రాజ్య సంస్థాపనాచార్యులు సమస్త రాజకీయ వ్యవహార మర్మజ్ఞులు రాయలవారి ప్రధానామాత్యు లగుతిమ్మరుసు మహామంత్రి పుంగవు లేతెంచు చున్నా (ఎదురేగి)

అమితౌదార్య! స్వధైర్యార్జిత సురాహార్యా! సుధీవర్య! మ త్యమరాచార్య! యుపాయసాధిత సుకార్యా! సద్యశోధుర్య! వ్యమతీ! తిమ్మరుసాహ్వాయపరిథిత! యప్పాజీ! మహామంత్రి స త్తమ! విచ్చేసి వరాసనంబును బ్రమోదంబొప్పఁగ నై సేయుమా

తంత్రావాపవిధాన దక్ష! రిపు దుస్తంత్రారిధ క్ష్మారాజ్యమా! మంత్రాలోచన నైపుణప్రవణ! శుంభద్గర్వ మత్తద్విష త్సంతానసార్తి విధాయకా! స్వజన సంత్రాణక్రియా తత్పరా మంత్రిగ్రామణి ధీమణీ బుధవతంసా! గద్దె నై సేయుమా!

(పీఠ నిర్దేశముఁ జేయును

తిమ్మ : (ప్రవేశించి దేవసభవలె నేత్రోత్సవముగావించు సభనంతను గలయఁజూచి ప్రమోద పులకితాంగుఁడై స్వపీఠమును సమీపించి) వైతాళికా! నవరసాలంకృ మహాప్రబంధ నిర్మాణ ధురీణులైన పెద్దనకవీంద్రుల శుచిస్మితాననులై యేతెంచు చున్నారు. సగౌర ముగా నాహ్వానింపుము.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



వైతా: (చూచి) "కవింగండ పెండెరము" నామక మణినూపుర ప్రజ్వలిత వామపాద!

నరవరు కోర్కె మేరకు న నన్యసుసాధ్య మనోజ్ఞ వాఙ్మయా భిరతి మెయిన్ శిరీషసుమ పేశల కమ్రసుధామయోక్తి ని ర్భర మనుసంభవంబను ప్రబంధము వ్రాసి, సగౌరవప్రథన్ బరగిన పెద్దనార్యకవి వర్య! స్వపీఠ మలంకరింపుమా!

చతురకవిత శ్రీకృష్ణ
క్షితిపు మనంబుల్లసిల్లఁ జేసి యుచిత స
త్కృతిఁ గొన్న యాంధ్రకవితా
పితామహా! పెద్దనార్య! విచ్చేయఁగదే!

(పీఠమును కనపరచును)

పెద్ద :- (ప్రవేశించి "సభాయైనమః" అనిసర్వులకు నమస్కరించి స్వపీఠమలంకరించును)

తిమ్మ:- (లేచి) వైతాళికా! పద్యపుష్పగుచ్ఛ సంవాసిత కావ్యోద్యాన విహారోచితులైన నందివంశాంబుధిచంద్రు లరుగుదెంచుచున్నారు.

వైతా : (చూచి) పారిజాతాపహరణ ప్రబంధనిర్మాణ నిపుణ!

కమ్మని ముద్దుపల్కులను కబ్బములన్ రచయించి, తేనిడెం దమ్మును నెమ్మితోడుతను దన్పఁగఁ జాలి, బుధాళిచేత స్తోత్రమ్ములుగొన్న మేటివి, బుధపరివరా! సుకవిత్వభూషణా! తిమ్మకవీంద్రవర్య! యరుదెంచి స్వపీఠ మలంకరింపుమా!

(పీఠమును జూపించును)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తిమ్మ : (లేచి) వైతాళికా! భక్తిముక్తిదాయక కాళహస్తీశ్వర మాహాత్మ్య కావ్యకర్త లేగుదెంచుచున్నారు.

వైతా : (చూచి) శివభక్తిరస పూర్ణ కాళహస్తీశ్వర శతకాది రచనాప్రవీణా!

చతురతఁ గాళహస్తివిభు సన్మహిమంబును వెల్లడించి, యీ
క్షితితలమందు భక్తతతిచిత్తము రంజిలఁజేసి: యెంతయున్
స్తుతమతివై విరాజిలిన ధూర్జటి సత్కవిరాజచంద్ర! యం
చితగతి గద్దెనెక్క దయసేయఁగదే! పరిషత్స్థలంబునన్
(పీఠనిర్దేశముఁజేయును)

ధూర్జ : (ప్రవేశించి॥ సభాయైనమః॥ అనిసర్వులకునమస్కరించి స్వపీఠాలంకృతుఁడగును)

తిమ్మ : (లేచి) వైతాళికా!సంగీతసాహిత్యవైదుష్య ప్రవీణులరుగుఁ దెంచుచున్నారు........

వైతా : (చూచి) నవరసోపేత వసుచరిత్ర కావ్యరచనా ధురంధరా !

శ్రీకరోజ్జ్వల మాధురీధురిస్వీయకావ్యసుధన్ సుధీ
లోకమెల్లను నిచ్చలున్ రసలుబ్ధులై తమిఁ గ్రోలఁగాఁ
బ్రాకటప్రతిభఁ వెలింగెడు రామరాజ విభూషణా
ఖ్యాక సత్కవిచంద్రమా! యిదె!గద్దియన్ గయిసేయుమా!
(పీఠమునుగనపరచును)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



రామ : (ప్రవేశించి "సభాయైనమః" అనిసభాసదులకునమస్క-
రించిస్వపీఠమలంకరించును)

తిమ్మ : (లేచి) వైతాళికా! హాస్యరసవిశారదులు విజయం
చేయుచున్నారు.........

వైతా : (చూచి) భువనవిజయ సభావిభూషణా!
అతిహృద్యంబుగఁ బాండురంగవిభు మాహాత్మ్యంబు వర్ణించి సం
స్తుతిపాత్రంబగు ప్రౌఢరీతిగతులందున్ లెస్ససంధించి భూ
పతి విద్వత్సభలన్ సదాజయము నాపాదించు ప్రజ్ఞాసమ
న్వితధీవైభవ! రామకృష్ణసుకవీ! పీఠంబధిష్ఠింపుమా!

(పీఠమును గనపరచును)

రామ : (ప్రవేశించి "సభాయైనమః" అని సభ్యులకు నమస్క-
రించి స్వపీఠాసీనుఁడగును)

తిమ్మ : (లేచి) వైతాళికా! సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న
హనుమత్సమేత శ్రీరామభద్ర చరణాంబుజ నిక్షిప్త
నిర్మలమనస్కు లేగుదెంచుచున్నారు.

వైతా : (చూచి) సరసనవార్థసంభరిత కావ్యరాజరచనా
చాతుర్యధుర్యా!

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



లలితోక్తిప్రథిత సూరితల్లజుల యుల్లం బుల్లసిల్లంగ, ని
మ్మల రామాభ్యుదయాఖ్య కావ్యతిలకంబున్ వ్రాసి శ్రీకృష్ణరా
యల యాస్థానమునన్ బ్రశస్తిఁగొని సామ్యప్రాప్తితో మించు
య్యలరాజాన్వయ రామభద్రసుకవీంద్రా! యిందు వేంచేయుమా!
(పీఠమును జూపించును)

రామ : (ప్రవేశించి "సభాయైనమః" అని సభాస్తారులకు నమ
స్కరించి స్వపీఠముననాసీనుఁడగును)

తిమ్మ : (లేచి) వైతాళికా! దృశ్యకావ్యోపమ సంభాషణాబ్ధ
పరిబంధరచనాప్రావీణ్య ప్రవణులేగు దెంచుచున్నారు

వైతా:(చూచి) ప్రశస్తశ్లేషప్రబంధ నిర్మాణక్రియాపారంగతా
చెలఁగి యపూర్వకల్పనలు చేర్చి పరిబంధములన్ రచించి పెం
పొలయఁగ శ్లేషకావ్యమున నొక్కట రాఘవపాండవపరిశ
స్తుల వెలయించి నిస్తులయశోరతి బేర్చిన సూరనార్యా! పిం
గళికులభూషణా! కొనుముగద్దెను సారసమేతభాషణా!
(పీఠమును గనఁపరచును

సూరన: (ప్రవేశించి "సభాయైనమః" అని సరిషత్సభ్యులకు
నమస్కరించి స్వపీఠమునధిష్ఠించును)

తిమ్మ : (లేచి) వైతాళికా! శ్రీమత్కాళీవరప్రసాదలబ్ధ వ
వర్ణనీయ కవిత్వతత్త్వ ధౌరేయులు వేంచేయుచున్నారు

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



వై తా : (చూచి) నిరంకుశోపాఖ్యాన మహాకావ్యకన్యాజనకా!
అనుపమ భవ్యనవ్యకవి తామృతపూరము చిప్పిలన్ సుధీ
వినుతనిరంకుశాఖ్య బహువిశ్రుతకావ్యము వ్రాసి కృష్ణభూ
పుని సభనొక్కదిగ్గజముఁబోలి మెలంగిన కందుకూరి వం
శ్య! నుతచరిత్ర! రుద్రకవిసత్తమ! గద్దెయలంకరింపుమా!

(పీఠముఁజూపించును)

రుద్రి : (ప్రవేశించి "సభాయైనమః" అని భువనవిజయ సభ్యులకు నమస్కరించి స్వపీఠాసీనుఁడగును)

తిమ్మ : (లేచి) వైతాళికా! శ్రీకృష్ణరాయాస్థాన చిత్రకారుతేతెంచుచున్నారు.

వై తా : (చూచి) కళామయమూర్తీ!

అమలమతిన్ సమస్థలము నందునె చూపుదు కాదె? మిట్టుప
ల్లములను? రంగుకుంచెను విలాసముగాఁగొని నైకరూప చి
త్రములను గూర్చుచుందు భళి రా! నవజీవకళన్ స్వపీఠ రా
జ మధివసింప రాగదవె? చయ్యనఁజిత్ర కళావిశారదా!

(పీఠమును జూపించును)

చిత్ర : (ప్రవేశించి "సభాయైనమః" అని సభాసదులకు నమస్కరించి తన యాసనమునఁగూరుచుండును)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తిమ్మ : (నానావిద్యాప్రసంగపరితోషిత సువర్ణశతకాంకిత పం
డితకవీంద్రా! జయీభవ! స్వచ్ఛతరకీర్తిచంద్రికాలం
కృత దశదిశాంతరాళా! విజయీభవ! నిర్జితానేక
రాష్ట్రరాడన్యశేఖరా! దిగ్విజయీభవ! కర్ణాటకాంధ్ర
ప్రాజ్యసామ్రాజ్యలక్ష్మీసంస్థాపకసార్వభౌమా పరాక్!
శ్రీనరసరాజ నాగాంబికాతనూభవరత్న బహుపరాక్!
అని లోపల వందిమాగధులు కైవారముచేయుచుం
డగా విని లేచి) వైతాళికా! స్వాశ్రితోపకృతి ప్రతిపాదన
కార్యధౌరేయులైన శ్రీకృష్ణదేవరాయసార్వభౌములు
దయచేయుచున్నారు.

వైతా : (చూచి) "మూరురాయరగండ"
విజయంచేయుఁడి యాంధ్రభోజ! నిజభూవిక్షేపమాత్రోపల
బ్ధ జయశ్రీమహిళోపగూహనక్రియాభ్యస్తోరు వక్షఃస్థలా!
స్వజనాభీష్ట ఫలప్రదా! విబుధ జీవంజీవ జైవాతృకా!
గజపత్యాది నృపావలేపహృతి దక్షా! కృష్ణరాయాధిపా!

(సింహాసనమును కనఁబరచును)

శ్రీకృ : (శీవిగాఁ బ్రవేశించి తనరాకతో భక్తివినమ్రశిరస్కులై
నిలువఁబడి నమస్కరించు సభాస్తారులను కూరుచుండు
డని హస్తసంజ్ఞఁ జేసి రత్నఖచిత సింహాసనాసీనుఁడై
శుచిస్మితజ్యోత్స్న నందఱిపైని బ్రసరింపఁజేయును)

(అందఱు నాసీనులగుదురు)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తిమ్మ : (లేచి) సత్కవిచంద్రులారా! శ్రీభువనవిజయ సభాస్తారులారా! శ్రీకృష్ణాపరావతారులైన మనరాయల వారు కేవలము భూమండలాధీశ్వరులేకాదు బహుకృతి భర్తలు కృతికర్తలునై యున్నారనునది సర్వలోకవిదితము. ఇప్పుడు రాజగురూత్తములు స్వాగతపద్యము నాశువుగా నందురు.

రాజగు: (లేచి శ్రీకృష్ణరాయాభిముఖుడై) విష్ణుచిత్తీయ మహాకావ్యనిర్మాణ నిష్ణాత!

స్వాగతంబనుపమ సత్కృపాపూరిత సకలసత్కవిజనాశావితాన
స్వాగతంబుద్ధుతరాశాంతవిశ్రాంత సందీపితాఖండ కీర్తిప్రతాన!
స్వాగతంబతుల సంసద్గౌరవప్రభాజాల ప్రభావప్రజ్జ్వలతమాన!
స్వాగతంబఖిల రాజన్యైక మకుటాయమాన సర్వవిధసంపన్ని ధాన!

స్వాగతము సంపదుపమిత స్వర్గరాజ!
స్వాగతము సత్కవీంద్ర గీర్వాణభూజ!
స్వాగతమనంతభూప నక్షత్రరాజ!
స్వాగతం బాంధ్రనవభోజ భానుతేజ!

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : వైతాళికా! నీవింక వెళ్లి సన్మానసమితివారిచ్చు పారితోషికములను స్వీకరింపుము.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



వైతా : చిత్తము (అని రాయలవారికి, తిమ్మరుసునకు, సభ
లకు నమస్కరించి నిష్క్రమించును.)

తిమ్మ : కవిచంద్రులారా! ఆశువుగా మీరొక్కరొక్క
రాయలవారిమీద ప్రశంసాపద్యము లనవచ్చును.

పెద్ద : (లేచి శ్రీకృష్ణరాయాభిముఖుఁడై) విద్వత్కవిరా
చకోరచంద్రిమా!

శరసంధాన బలక్షమాది వివిధైశ్వర్యంబులున్ గల్గి, దు
ర్భరమండత్వాబిల ప్రవేశచలన బ్రహ్మఘ్నతల్ మానసన్,
నర, సింహ, క్షితిమండ లేశ్వరుల నెన్నన్ వచ్చు నీసాటిగా
నరసింహక్షితి మండలేశ్వరుని కృష్ణా! రాజకంఠీరవా!

రామకృ: (లేచి ఆదిలోనే హంసపాదమన్నట్లు కంఠీరవా! య
సంబోధించి తాతగారు బిలప్రవేశముఁజేసిన సిం
మును తోకబట్టి లాగి, స్వవచనవిఘాతము నా పాదిం
కొనినారే?

పెద్ద : (కంఠీరవశబ్దప్రయోగమును దప్పుగా సమ్మతించి
త్తరుఁడై యుండును.)

తిమ్మ : (లేచి) రామకృష్ణకవీ! మీరు నిర్దుష్టముగాఁబద్యమ
జెప్పఁగలరా?

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



రామ : (లేచి) చెప్పమందురా? (శ్రీకృష్ణరాయాభిముఖుఁడై) గుణగ్రహణపారీణా!

"కలనన్ దావక ఖడ్గఖండితరిపు క్ష్మాభర్త మార్తాండ మండల భేదం బొనరించి పోవునెడఁదన్మధ్యంబునన్, హార, కుండల కేయూర కిరీట భూషితుని, శ్రీనారాయణుం గాంచి లోగలఁగంబారుచు నేగె నీవయ్యను శంకన్ గృష్ణరాయాధిపా!"

(నమస్కరించి కూరుచుండును)

పెద్ద : [లేచి కృష్ణరాయాభిముఖుఁడై] శాంతోదారగుణ గ్రత్నాకరా! మన రామకృష్ణులు చెప్పిన పద్యము నిర్దుష్ట మైనదని నేనొప్పుకొనుచున్నాను.

రామకృ: [లేచినవ్వుచు] మహాప్రభూ! తాతగారి పద్యములోని కంఠీరవశబ్దమున కర్థము శ్రేష్ఠుఁడని కాని? సింహామని, కాదు. కాబట్టి తాతగారిపద్యము నిరుపమానమైనదని యన్యకవి దుర్లభమైనదని చెప్పకతప్పదు.

[కూరుచుండును]

నంది : [తిమ్మరుసు సంజ్ఞననుసరించి లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై] మందహాస విద్యోతవదనాంభోజ!

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



అనుపమ గానవైఖరి యనర్గళ సాహితిసౌష్ఠంబు సౌ
రు నజునిరాణి వాణికి నురోజయుగంబుగ విజ్ఞులౌ సుధీ
జనులు వచింతురు తాదృశ రసజ్ఞ నికాయ మనోజ్ఞ భారతీ
స్తనయుగ భాసమానుఁడవు సత్కవి లోక చకోర చంద్రమా!

[నమస్కరించి కూరుచుండును]

తిమ్మ: [లేచి] ధూర్జటికవీంద్రా! మీరుకూడ ఆమకుటముతో "న" ప్రాసముతోనే పదాంతరములతోఁబద్యమనండి.

ధూర్జ: చిత్తము [లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై] సార్వభౌమ శిఖామణీ!

అనుపమమైన గానము మహత్తర సాహితి రెండు వాణికిన్
స్తనములటంచుఁబండిత వతంసులు చెప్పుచునుంద్రు: గాన బ
వనతర తత్సభాజన సభాజన భాజన భవ్య భారతీ
స్తనయుగ భాసమానుఁడవు సత్కవిలోక చకోర చంద్రమా!

[నమస్కరించి కూరుచుండును]

రామరాజ: [తిమ్మరుసు సంజ్ఞననుసరించి లేచి శ్రీకృష్ణదే రాయాభిముఖుడై] శత్రుదోర్వీర్యాపహారక్రియా ధౌరేయా!

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



పరిచరతరోజ్జ్వలద్రస పిపాసు సమస్తమనీషి సంచయా
భ్యాచిత హృదీప్సితప్రద మహోన్నత నిర్మలగాన సత్కళా
రుచి, వరసాహితీవిభవ రూఢి సమాహ్వాయ హృద్య వాక్సతీ
కుచయుగ భాసమానుఁడవు కోవిదకోటి చకోరచంద్రిమా!

[నమస్కరించి కూరుచుండును]

తిమ్మ : (లేచి) సూరనకవివర్య! మీరుకూడ ఆమకుటముతో
"చ" ప్రాసముతోనే పద్యము జెప్పండి.

సూర : చిత్తము (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)
క్రియానుమేయమైన సత్కార్య!

సుచరిత శోభితుండవు యశోవిసరప్రసృతి ప్రపూర్ణ ది
జ్నిచయుఁడ వాంధ్రభోజుఁడవు నిస్తులమూర్తివి గీతిసాహితీ
రుచిర తరాభిధేయ సువిరూఢ సువిభ్రమ యుక్త వాగ్వధూ
కుచయుగ భాసమానుఁడవు కోవిదకోటి చకోరచంద్రమా!

(నమస్కరించి కూరుచుండును)

రామరా : తిమ్మరుసు సంజ్ఞననుసరించి లేచి శ్రీకృష్ణదేవ
రాయాభిముఖుఁడై వితరణ గుణాభరణా!

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



జానొప్పన్ సుమనఃప్రియుండగు నజస్రంబెవ్వఁడెవ్వాసి యా
స్థానక్షోణి నొగిన్ బుధుల్ కవివరుల్ దారుంద్రా! యయ్యంగనా
సూనాస్త్రుండవు గోత్రవర్ధనుఁడవై శోభిల్లు నోకృష్ణ రాట్
ఛ్మానాకేశ్వర నీవు నిక్కము దలంపన్ రాజమాత్రుండవే!

(నమస్కరించి కూరుచుండును)

రుద్ర: (తిమ్మరుసు సంజ్ఞననుసరించి లేచి శ్రీకృష్ణదేవరా

యాభిముఖుఁడై) వేదవేదాంగ విద్యాపారంగతా!

అంగ బంగాళ కళింగ నేపాళాది

భూపాల గర్వ నిర్వాపకుఁడవు

ఆంధ్ర కర్ణాట విద్యాలతా త్యాశ్రయ

భూత విస్తృత కల్పభూరుహుఁడవు

ఆముక్తమాల్యదాఖ్య మహాప్రబంధ ని

ర్మాణ కౌశలకళా ప్రాభవుఁడవు

అష్టదిగ్గజ బిరుదాభిభూషిత కవి

వర్య కీర్తిత మహావైభవుఁడవు

దండితారి భూమండలాఖండలుఁడవు

స్తవ్యవైద్యవిద్యాలయ స్థాపకుఁడవు

భువనవిజయ సభాశిరోభూషణుఁడవు

రాజమాత్రుండవే? కృష్ణరాయ దేవ

(నమస్కరించి కూరుచుండును)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



చిత్రి : (తిమ్మరుసుసంజ్ఞననుసరించి లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై) తుళువాన్వయ క్షీరసాగర రాకాసుధాకరులైన దేవరవారు చిత్రకారుఁడాశువుగాఁ బద్యముఁ జెప్పఁగలఁడా? యని యాశ్చర్యపడుచున్నట్లున్నారు కాని? సాహితీసమరాంగణసార్వభౌమా! భవదీయ వదనాంబుజావలోకనమున సమకూరని సౌభాగ్యము లేముండును?

భవదీయ దర్శన భాగ్యమబ్బినయంత
మూర్ఖుండు సాహిత్యమును గ్రహించు
భవదీయ సాంగత్య ఫలముచేకురినంత
కవితనేర్వనివాఁడు కవితఁ జెప్పు
భవదీయ కారుణ్యావశత, గానానభి
జ్ఞుఁడు గానకళఁ బండితుఁడుగఁ బరఁగు
భవదీయ సంస్థాన వాసుఁడై రణకేళి
నసమాన శూరుఁడై యతిశయించు

భవదధీనస్థుఁడై బీదవాఁడుకూడ
సకలసౌభాగ్య శాలియై సంతసించు
భవ్యగుణసాంద్ర! సర్వైభవసురేంద్ర
వరగుణోపేంద్ర! శ్రీకృష్ణపార్థివేంద్ర!

(నమస్కరించి కూరుచుండును )

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తిమ్మ : (లేచి) చిత్రకారులు యథార్థమును గ్రహించినారు. మూఁడవకార్యక్రమము సమస్యాపూరణము కవులు తమకిచ్చు సమస్యను పూరించి వానిభావమును కూడ జెప్పుదురు. పెద్దనకవీంద్రా! "రతియే నీకు శుభప్రదంబు గుణధుర్యా! బ్రహ్మచర్యవ్రతా!" పూరింపుడు.

పెద్ద : (లేచినిమిషమాలోచించి)

ధృతి డెందంబును జక్కఁబట్టుకొని, శు
ద్ధింగొన్నయేబుద్ధి సు
వ్రతుఁడై శబ్దమునున్నగా విషయముల్
వర్జించి, రాగద్వనా
హతుఁడై సద్గురుబోధము క్తిఁగనునో
యాబ్రహ్మనిష్ఠైకధీ
"రతిరేయే నీకు శుభప్రదంబు గుణధు
ర్యా! బ్రహ్మచర్యవ్రతా!"

(నమస్కరించికూరుచుండును)

తిమ్మ : (లేచి) తిమ్మనకవీంద్రా! "రతమే భారతదేశవాసులకు స్వర్గారోహణంబే యగున్" పూరింపుడు.

---

రతి, రతము — స్త్రీ పురుషుల కలయిక

---

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తిమ్మ : (లేచి నిమిషమాలోచించి)

క్షితిపై పంచమవేదమంచును బ్రశస్తింగాంచి, ద్వైపాయనా ఖ్యాతపస్వి ప్రవరప్రణీతమగుచున్ వ్యాప్తిం దగం జెంది, వి స్తృతధర్మప్రతిపాదకంబయిన, యాశ్రీమజ్జయాభిఖ్య, భా "రతమే, భారత దేశవాసులకు, స్వర్గారోహణంబే యగున్"

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : (లేచి) ధూర్జటి కవీంద్రా! "మయమున్ వాడుదు రెందఱెందఱో సతుల్ మాభర్తృగేహంబులన్" పూరింపుడు.

ధూర్జ : (లేచినిమిషమాలోచించి)

నియతిన్ స్నానము లాచరించి, కడుపూ
న్కిన్, బట్టుచేలల్ నగల్
నయ మొప్పన్ గయిసేసి, పళ్లెరములన్
నానావిధోపాయనో
చ్చయముల్ గైకొని యేగి, యారతిడుచో
సమ్యగ్గతిన్ గీతివా
"జ్మయమున్ వాడుదు రెందఱెందఱో సతుల్
మాభర్తృగేహంబులన్"

(నమస్కరించికూరుచుండును)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తిమ్మ : (లేచి) రామభద్రకవీంద్రా! ఆసమస్యనే మీరుకూడ భావాంతరముతోఁ బూరింపుడు.

రామ : (లేచినిమిషమాలోచించి)

నియమంబున్ మఱి నిష్ఠయుఁ బెనఁగొనఁ
విష్ణ్వాలయ ప్రాంగణం
బు, యథాశక్తి నలంకరించు నెడ, సం
మోదంబు సంధిల్ల, భ
క్తియుతాంతఃకరణాభ్యుపేతలయి, త
ద్దేశంబు నల్కంగ, గో
"మయమ్ముఁ వాడుదు రెందఱెందఱో సతుఁ
మాభర్త గేహంబులఁ"

(నమస్కరించికూరుచుండును)

తిమ్మ : (లేచి) రామకృష్ణకవీంద్రా! "మదగజయానకున్" అవికమాత్రము చాలును చీరయేటికిఁ" పూరింపుడు.

రామ : (లేచినిమిషమాలోచించి)

ఇదియొక పెండ్లికార్యమగునే? మదిరాక్షులు పుట్టినింటికిన్
బడిఁబడి వచ్చుచుంద్రు కద? వారికి వచ్చినయప్పుడెల్ల, నిం
పిదమ్ముగ, సారెచీరలను బెట్టు ధనాఢ్యుల మొక్కఁ! నేటికిఁ"
"మదగజయానకుఁ అవికమాత్రము చాలును, చీరయేటికిఁ"

(నమస్కరించికూరుచుండును)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తిమ్మ : (లేచి) సూరన కవీంద్రా! "సీరిన్ బావ! యని శౌరి చేరం జీరెన్" పూరింపుడు.

సూరన: (లేచినిమిషమాలోచించి)

వీరాభిమన్యు మృతికిన్ దారుణతర శోకవహ్ని తాపంబునఁ బె
ల్లారాట మొందు శౌనా "సీరిన్ బావ! యని శౌరి చేరం జీరెన్"

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ: (లేచి) రామరాజ భూషణకవీంద్రా! "గాలివాన మొదవు మేలు చూవె?" పూరింపుడు.

రామ : (లేచి నిమిషమాలోచించి)

జ్యోతు లందు రవియుఁ జుక్కలఁ జందుఁడు
మనుజులందు సూరియును దలంపఁ
జెట్టులందు రావి చెట్టును మఱి సఁ
"గాలివాన మొదవు మేఁ చూవె!"

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : (లేచి) రుద్రయకవీంద్రా! "రమణి కుదయించెఁ గోమరుఁడా రమణియందు" పూరింపుడు.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



రుద్ర : (లేచి నిమిషమాలోచించి)

మానిదుర్వాసువరముల మహిమఁ దెలియఁ
గుంతిమంత్రమునన్ వివస్వంతుఁబిలిచె
యతివర వరప్రభావ సంగతిని నంబ
రమణి కుదయించెఁ గొమరుఁడా రమణియందు

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : (లేచి) రాజగురూత్తమా! "గజముల్ వ్రాసిన గ్రంథ రాజములలోఁ గన్పట్టువై చిత్ర్యముల్" పూరింపుడు.

రాజ : (లేచి నిమిషమాలోచించి)

నిజవిస్ఫూర్జిత సాహితీప్రతిభలన్ విన్నాణమున్ జూపి, సూ
రిజన శ్రేణికి మోదమున్ గొలుపుచున్ గృష్ణాధిపాస్థాన భూ
మి, జగామేటి హొరంగువన్నియల పేర్మిం గాంచు నయ్యష్ట ది
గ్గజముల్ వ్రాసిన గ్రంథరాజములలోఁ గన్పట్టు వై చిత్ర్యముల్

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : (లేచి) చిత్రకళామూర్తీ! "మలముఁదినుము నీదు నోటి మలినము వోవన్" పూరింపుడు

చిత్ర : (లేచి నిమిషమాలోచించి)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



లలి మృదుల నాగవల్లీ
దళ మృగమద పూగఖండ తతి నవముక్తా
ఫలచూర్ణ కలితమైన, త
"మలముఁ దినుము నీదు నోటి మలినము వోవున్"

[నమస్కరించి కూరుచుండును]

తిమ్మ : (లేచిరాయలవారి ప్రసన్నవదనముఁ జూచి)

సగుస్యలను జక్కగాఁ బూరించి కవిచంద్రులు తమప్రజ్ఞా ప్రాబల్యములఁ బ్రదర్శించి సభాసదులను సంతోషపెట్టఁ గలిగినారని, ప్రభువులుగ్రహించి సంతృప్తిఁ జెందినారు.

ఇప్పుడు నాల్గవకార్యక్రమములోఁ గవితల్లజులు తమ తమ ప్రబంధసుధాపారావారములనుండి యొకరెండు పద్యామృతబిందువులను శ్రోతృకర్ణ పేయముఁ జేయుదురుగాత. పెద్దన కవీంద్రా! మీమనుచరిత్ర కావ్యకథానాయిక వరూథిని ప్రవరునిచేఁ బరిభూతురాలై రోదనము. జేసినదని వ్రాసిన పద్యము వినుటకుఁ బ్రభువులతోఁబాటు సభాసదు లువ్విళ్లూరుచున్నారు

పెద్ద : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



"పాటున కింతులోర్తురె? కృపారహితాత్మక! నీవు ద్రోవ, ని
చ్చోటభవన్నఖాంకురము సోకెఁ గనుంగొనుమంచుఁ జూపి, య
ప్పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చెఁ, గలస్వనంబునన్
మీటిన విచ్చు గుబ్బచను మిట్టల నశ్రులు చిందు వందగన్"

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : (లేచి) తిమ్మనకవితిలకా ! మీ పారిజాతాపహరణ కావ్య కథానాయిక సత్యభామ పారిజాతపుష్పముఁ దనకీయక కృష్ణుడు రుక్మిణికిచ్చినాడని క్రోధవిస్ఫురితాధరయై స్త్రీజన సహజమైన బేలతనముతో నేర్చినట్లు వ్రాసినపద్యము వినుటకు........

తిమ్మ : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

"ఈసునఁబుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠ కలకంఠ వధూ కల కాకలీధ్వనిన్"

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : (లేచి) రామరాజభూషణకవీశా! మీరుకూడ మీ వసుచరిత్రకావ్యకథానాయిక గిరిక వసురాజుమీఁది

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



విరహవేదన సహింపలేక విలపించిన విధానము వర్ణించిన పద్యమును...........

రామ : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

"ఆజాబిల్లి వెలుంగు వెల్లికల, డాయన్ లేక, రాకానిశా
రాజశ్రీసఖమైన మోమునఁ బటాగ్రంబొత్తి, యెల్గెత్తి, యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూ రాజత్కరాంభోజ కాం
భోజీమేళ విపంచికా రవ సుధాపూరంబు తోరంబుగన్"

(నమస్కరించి కూరుచుండును)

రామకృ : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

రసికశిఖామణీ! అల్లసానివారటునిటు, ముక్కుతిమ్మన గారు ముద్దుముద్దుగా భట్టుమూర్తిగారు బావురు మనునట్లుగాఁ దమకావ్య కథానాయికల నేడిపించినారు సుమాండి!

శ్రీకృ : (సభ్యులునవ్వుచుండగా శుచిస్మితాననుఁడగును)

తిమ్మ : (లేచి) రామకృష్ణుల పరిహాసోక్తుల కేమిగాని? తిమ్మన కవీంద్రా! నారదుఁడు రుక్మిణీదేవికిఁ బారిజాత పుష్ప ప్రభావముఁ జెప్పిన పద్యము వినుటకుఁ బ్రభువులుత్సాహపడుచున్నారు.

తిమ్మ : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



"అలినీలాలక! నీవు నీపతి, రహస్యక్రీడ వర్తించు, వేళ, లతాంతాయుధ సంగరంబునకు, నుల్లాసంబుఁ గల్పించు, నుజ్జ్వలదీపాంకురమై, రతిశ్రమ తనూసంజాత ధారాళ, ఘర్మలవంబుల్ తొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్"

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ: శృంగార రసమునందు మీకుండునాసక్తితో బ్రహ్మచారియగు దేవర్షితచేతకూడ, శృంగార రసరహస్యమును వర్ణింపఁజేసి, శృంగార రసమయమూర్తు లనిపించుకొనినారు మహాకవీ! రామరాజ భూషణకవిచంద్రా! మీకావ్యకథానాయిక ముక్కును సంపెంగ పువ్వుతోఁ బోల్చి వర్ణించిన పద్యమును.........

రామరా: (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

"నానాసూన వితాన వాసనల, నానందించు సారంగ, మేలా? నన్నొల్లదటంచు గంధఫలి, బల్కాకన్ దపంబంది, యోషానాసాకృతిఁదాల్చి, సర్వసుమన స్సౌరభ్య సంవాసియై పూనెన్ ప్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు లిర్వంకలన్"

తిమ్మ: బాగు బాగు మీకవితాసౌందర్య మపూర్వమనక తప్పదు. సూరనకవిరాజా! మీకళాపూర్ణోదయ కావ్య కథానాయిక కలభాషిణి సఖీసమేతమై, పూఁదోటలో

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



ఁబూఁదీవెటుయ్యాలల నూగుటఁగాంచి మణికంధరుఁడు
నారదునితో నన్నపద్యము వినిపించండి!

సూర : చిత్తము (అనిలేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

"తమిఁ బూదీవెలఁ దూఁగుటుయ్యాలలఁ బం
తాలాడుచుండూఁగు, నా
కొమరుంబ్రాయఁపు గబ్బిగుబ్బెతల, యం
ఘుర్రిల్ చక్కఁగాఁ సాగి, మిం
టి మొగంబై చనుదెంచుతీవిఁ గనుఁగొం
టే? దివ్యమౌనీంద్ర! నా
కమ్మృగీనేత్రల మీఁదఁ గయ్యమునకుం
గాల్దాఁచు లాగొప్పిశిన్"

తిమ్మ : ఆపద్యమునకు సమాధానముగా దేవర్షి చే ననిపించిన
పద్యముగూడ............

సూర : చిత్తము

"భళిరా! సత్కవివౌదు నిక్కము తగన్ భావించి నీయన్న యా
యెలప్రాయంపు మిటారికత్తెల బెడంగే నెందునుం గాన వా
రల డోలాచల నోచ్చల చ్చరణముల్ త్రైవిష్టపస్త్రీల యా
దలఁ దన్నన్ జనునట్లు మించె ననిసన్ దప్పేమి? యొప్పెం
యగున్"

(నమస్కరించికూరుచుండును)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తిమ్మ : (లేచి) బ్రహ్మచారి యగు నారదునితో నెంత నయ గారవు మాటలాడించినారు? ధూర్జటి కవీంద్రా! తమ కాళహస్తీశ్వర శతకములోని రెండు భక్తిప్రబోధక పద్యములను వినిపించండి.

ధూర్జ : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

"ఏ వేదంబుఁ బఠించె లూత? భుజగం బే శాస్త్రముల్ సూచె? దా నే విద్యాభ్యసనంబొనర్చెఁ గరి? చెంచే మంత్రమూహించె? బో ధావిర్భావనిదానముల్ చదువు, లయ్యా! కావు, నీపాద సం సేవాసక్తియె కాని, జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!"

"దంతంబుల్ పడనప్పుడే తనువునన్ దారూఢి కానప్పుడే, కాంతాసంఘము రోయనప్పుడె, జరాక్రాంతంబు గానప్పుడే, వింతల్ మేనఁ జరించనప్పుడె, సిరుల్ వెల్వెల్లఁ గానప్పుడే, చింతింపన్ వలె, నీపదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా!"

(నమస్కరించికూరుచుండును)

తిమ్మ : (లేచి) భక్తశిఖామణీ! శ్రవణమాత్రమునఁ బాపపంక ప్రక్షాళక పద్యములు వినిపించి సర్వులను సంతోషసాగ రమునఁ మునకలు వేయించినారు రుద్రయకవీంద్రా! నిరంకుశోపాఖ్యాన కథాదిని మాణిక్యపురవర్ణనము గురించి చెప్పిన పద్య మనండి.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



రుద్ర: (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

వైడూర్యకల్పిత ద్వారదీప్తులు పుష్య
రాగకవాటజ ప్రభలఁ బెనుప
మరకత కుడ్య సంపాతదీధితి మహా
నీలవేదీశ్రీకి నెనరుఁ జూపఁ
బద్మరాగోజ్జ్వల ప్రాసాదరుచి విద్రు
మ స్తంభ కాంతుల మమతఁ బ్రోవఁ
వజ్రకుట్టిమశోభ వరమౌక్తిక స్యంద
నచ్ఛాయ కేప్రొద్దు నట్లు సేయ
దీప్రి గోపుర గోమేధిక ప్రకాశ
మనుదినంబును దనకుఁ దోడభిలషించు
నిఖిలమణిసంపదలు నందు నెరయు కతన
మణిపురంబండ్రు దాని నామము నృపాల!

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ: (లేచి) చివరి కార్యక్రమములోఁ గవిశేఖరులు తమ
తమ కావ్యకథాసారాంశములు వినిపించెదరు.

పెద్ద: (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

ఈశ్రీకృష్ణ దేవరాయ సార్వభౌముఁ లోకనాడు పేరో
లగంబుండి, యాదరపూర్వకంగా నన్ను బిలచి—

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



సప్త సంతానములలోఁ బ్రశస్తిఁగాంచి
ఖిలము కాకుండునది ధాత్రిఁ గృతియ కాన?
కృతి రచింపుము మాకు శిరీషకుసుమ
పేశల సుధామయోక్తులఁ బెద్దనార్య!॥

అని యాదేశించుటయు ఈరాజచంద్రుఁడు శృంగారరస లాలసుండగుటచే శృంగారరస ప్రధానమైన కావ్యమును రచించి యీభూవల్లభుని డెందంబున కమందానందముఁ గూర్పనుద్యమించి మార్కండేయపురాణమునందలి స్వారోచిష మను సంభవ కథావస్తువును ప్రాతిపదికగా గ్రహించి యందు వరూథినీ ప్రవరుల పాత్రసృష్టి విషయమునఁ బరస్పర విరుద్ధములైన వైరాగ్య శృంగార భావములకు నేకత్రస్థితిని గల్పించి రసాభాస కన్పట్టకుండ నేరసమున కారసము పరమావధిగాఁ బండిత శ్లాఘనీయముగాఁ గూర్చి ఈరాయలవారికేఁ దాత్కాలిక కవిలోకమునకు విస్మయానందంబుల సందడింపఁ జేసితిని.

ప్రవరుఁడు సదాచార సముపేతుఁడు పరమనైష్ఠికుఁడు ఏకపత్నీవ్రతుఁడునై యలరారుచు సిద్ధోపలబ్ధ పాదలేపప్రభావంబున హిమాలయ పర్వతంబును దర్శింపఁబోయి. యట మంచునీటఁ బాదలేపము కరఁగి పోగాఁ దానుతిరిగి స్వస్థానముఁ జేరుటకు ననువుగామి, దారినడిగి, తెలిసికొనవలయునని, చెంత వీణవాయించుచున్నవరూథినిని డాయంబోయెను.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



అదిమరియొక సందర్భమైనచోఁ బరస్త్రీకడకుఁ జేరక పోవును. తనకు దారి చెప్పువారితరులెవరు లేమిచే గత్యంతరము లేకపోయినది.

వరూధిని తనకు నచ్చిన పురుషునికై నిరీక్షించుచున్న సమయమది. తన్ను వలచిన స్వారోచియను గంధర్వుని ధిక్కరించి తనకు ననుకూలుఁడగు పురుషునికై యన్వేషించు చుండెను.

అట్టి సమయములో నవమన్మథాకారుఁడగు ప్రవరుఁడు దృష్టిగోచరుఁడు కాగాఁ దన ప్రేమను సర్వస్వమును ధారవోయ నిశ్చయించెను. కాని? అతని నియమనిష్ఠలందులకుఁ దావీయ లేదు అని చెప్పుచుఁ బ్రవరుని దృఢవైరాగ్యమును వరూధిని గాఢశృంగారమును రసోచితముగా వర్ణించి "ఆంధ్రకవితా పితామహ" యను బిరుదమును సార్థకము జేసికొంటిని.

ఇట్లు స్వారోచిష సంభవమను ప్రబంధమును నిర్మించి ప్రబంధకవులందఱకు మార్గదర్శకుఁడనై ఈ ప్రభువులచే బహు విధసత్కారములఁ బడయఁగలిగితినని సగర్వముగాఁ జెప్పు కొనుచున్నాను. జయహింద్ (నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : (లేచి) ధూర్జటి కవీంద్రులు శివభక్తిరస భరిత కాళహస్తీశ్వర మాహాత్మ్యకావ్యసారాంశమును జెప్పెదరు

ధూర్జ : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)
మహాపాపహానన మగు మహాదేవశబ్దముచే సంబోధింపఁ

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



బడువాఁడు పరమశివుఁడు భక్తులనగచాట్లు పాలుచేయక, ఆలసింపక ప్రార్థించిన వెంటనే అపారకరుణామృతధారలు గురియించి రక్షించుటయే మాపరమేశ్వరుని కళ్యాణగుణవైభవము

తిన్నడు ఆటవిక జాతిలోనివాఁడు ఒకనాడాతఁడు వేఁటకు వలయు సాధనములతో వెళ్లి మహారణ్యంబున మృగంబుల వేటాడి వచ్చుచు నొకచోట తరునికుంజ పుంజాచ్ఛాదితము ననభ్యర్చితము నగు శివలింగమును జూచినాడు.

అతనియొడలు పులకరించినది చేతులుజోడించి ప్రణమిల్లి మహేశ్వరా! ఇందు నొంటరివై యుంటివా? నీకుఁదోడు లేదా? స్నానము లేదా? ఆహార మెవరిత్తురు? ఇట్టిస్థితిలో నేను నిన్ను విడిచిపెట్టి వెళ్లగలనా? అనుచు భక్తిపారవశ్యమున సువర్ణముఖీజలంబులఁ బుడిసిటం దెచ్చి, శివునికి స్నానంబుఁ గావించి మాంసపుకఱకుట్లు పేర్చి ముందుంచి, తినుమయ్యా! యని ప్రార్థించినాడు.

“ప్రభూ! తినవేని? నాశిరము నీలింగముపై మోదికొని బ్రద్దలుచేసికొందు” ననఁగా శివుఁడు వానియుద్రేకముఁగాంచి సరే! అని వానిని భక్షించినాడు.

పూజారి యనుమానము దీర్చుటకు శివుఁడు తిన్నని భక్తి పరీక్షింపఁదలఁచెను తిన్నడు మునుపటివలెనే శివునికి

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



మాంసపుకఱకుట్లు ముందుంచి తినుమని వేఁడుచు, శివుని కంటి నుండి కన్నీరుధారలుగా బాఱుట చూచెను. "స్వామీ!" నీ కంటికి బాధకలిగినదా? మందులు వేసినను తగ్గలేదా? నాకంటి నూడఁబెఱికి నీకతికింతునని తనకంటినూడఁబెఱికి శివునికిఁ గంటిగానమర్చెను. మఱల్ల రెండవకంటినుండి నీరువఱదలై పాఱుటజూచి ఇదియే సాధనమని తనరెండనకంటిని వెలికినూడ బెఱికి తానపుడు కండ్లులేని యంధుఁడు గాన పాదరక్షతో శివునికంటిపరిదేశము గుఱుతుగాఁ ద్రొక్కి తనకంటి నతుకగాఁ బరమశివుఁడు సాక్షాత్కరించెను.

దేవతలు కల్పతరు ప్రసూనవర్షము గుఱియించిరి. ఈ విధముగాఁ తిన్నఁడు దుర్లభమగు ముక్తిని పొందినాడు.
జయహింద్ (నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : (లేచి) తిమ్మనకవీంద్రులు తమ పారిజాతాపహరణ
ప్రబంధ ప్రాశస్త్య సారాంశమును వినిపించెదరు...

తిమ్మన: (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై )
శ్రీకృష్ణదేవరాయల యాస్థానమున నష్టదిగ్గజములని ప్రసిద్ధిగాంచిన కవులలో నేనొక్కఁడను. విశేషించి రాణిగారి యరణపు కవినగుటచే నాకు మఱింత ప్రాశస్త్యము కలదు.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



కారగారాంతరమున రాణియెడ సార్వభౌములకుఁ గలిగిన వైమనస్యమును దొలఁగించు నాశయముతోఁ బారిజాతాపహరణ మను ప్రబంధరాజమును నిర్మించితిసి.

అందు శ్రీకృష్ణుఁడు రుక్మిణీమందిరమున రుక్మిణితో ద్యూతకేళీ వినోదము సలుపుచున్న యవసరమున నారదుఁడు వచ్చి, పద్మపత్రమునఁ బొదిగియున్న పారిజాత పుష్పమును శ్రీకృష్ణుని కరకమల మందుంచుటయుఁ గృష్ణుఁడా సుమరాజమును రుక్మిణికిచ్చుటయుఁ నారదుఁడు రుక్మిణి దిక్కు మొగంబై యాపారిజాతసుమప్రభావము నుగ్గడించి, "యీమహానుభావుఁడీ పుష్పము నీకిచ్చుటంబట్టి యతనికి నీ వెంతయుఁ గూర్చుదానవని వ్యక్తమగుచున్నది.

ఇంతదనుక మాధవుఁడు సత్యభామాధవుఁడని చెప్పఁ కొనువార్త కల్లయయ్యెను. ఈపుష్పమును ధరించిన నీకు నీసవతులందఱు పాదాక్రాంతలగుదురు. సత్యభామగర్వము సర్వము ఖర్వంబగును" అని పెక్కువిధముల పొగడి మగిడిచనెను

అనంతరము శ్రీకృష్ణుఁడు సత్యభామకీయుదంతము తెలిసెనేమో! యామె నోరడించుటకుఁ బోవలయునని సత్యామందిరమున కేగెను.

కోపగృహంబునఁ గంకటిపై ఆపాదమస్తకము నీలి ముసుంగు వేసికొని, పడియున్న ప్రియురాలిని జూచి, యామె

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



చేటిక చేతిలోని దీవనను తాను గైకొని, యామెనావలికిఁబో సైగచేసి, కృష్ణుఁడే తాళవృంతముతో వీవఁ దొడఁగెను అంతకు మున్ను పారిజాతపుష్పమును ధరించిన చేతులగుటచే నాపుష్ప సౌరభము వాయుమిళితమై, ముసుఁగులోనున్న నామెనాసా రంధ్రములఁ జొచ్చెను.

అందులకామె తనప్రియుఁడు తనకుఁ బారిజాతసుమమును కొనితెచ్చెనేమో యని బ్రమసి, ముసుఁగుఁదొలఁగించి రిత్త చేతులతోనున్న జగన్నాటకసూత్రధారునిఁజూచి ద్విగుణీకృత కోపముతో మరల ముసుగు వేసికొనెను. అంత నందనందనుడు పలువిధముల నామెననునయించియు చరితార్థుడు కాలేక నామెపాదపల్లవములు తనమౌళిభాగంబు సోకునట్లుమ్రొక్కెను పుష్పబాణుని జనకుడైన కృష్ణుని మస్తకమును నామె తన యెడమకాలితో దొలగద్రోచెను.

అప్పుడు కృష్ణుడాకాంతంగాంచి నీవిట్లు నాశిరస్సునుతన్నుట అది నన్ను మన్నించుటయే. నాకఠిన శిరస్సు తాకి నీపదపల్లవము నొచ్చెనేమో యని వగచుచున్నవాడను. ఇకనైన కోపముపమానవుకదా? అనుటయు నాలలనామణి పానుపునుండి సగము లేచి "యీ మొగమిచ్చకపు మాటలకేమిగాని? నీచేతలు నీపసలు అన్నియు తెలియవచ్చెనులే ఇంత అవమానముజెంది నేజీవింప నేల?" యని యాపైని మాటరాక ఈసు శోకము అగ్గ

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



లపుకాగా బాలికేశు నెదుట మోముపై పైట చెంగు వేసికొని మధురమైన కోకిలధ్వనితో నేడ్చెను.

అప్పుడు కృష్ణుడామెను లాలించి "పూవుమాత్రమున కే యింతవంత యెందులకు? దేవేంద్రునిజయించి పారిజాతవృక్షము నే కొనివచ్చి నీపెరటిలో నాటెదను." అని చెప్పి సత్యభామ యలుక దీర్చి మనమలరఁజేసెను. అనునీఘట్టమును ముద్దు పలుకులతో రసాభ్యుచిత బంధురముగా రచించి శ్రీవారికి మనః ప్రసాదము గల్పించి రాణిమెడల విమనస్కతను తొలఁగించి వారియన్యోన్యానురాగగ్రంధికి నిదానమైతినని చెప్పుట కెంతయు సంతసించుచున్నాను. జయహింద్ (నమస్కరించికూరుచుండును)

తిమ్మ : (లేచి) రామభద్రకవీంద్రులు తమ రామాభ్యుదయ ప్రబంధ విశిష్టతను విశదీకరించెదరు.

రామ : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై) నేను శ్రీ రాయలవారి యాస్థానమున నెన్నికగన్నవాఁడను ఆదికవియగు వాల్మీకిమహర్షి రచించిన శ్రీమద్రామాయణ కథావస్తువును గ్రహించి రామాభ్యుదయ మను పేర ప్రబంధరాజముగా రచించితిని.

భాస్కరాది మహాకవులు తెలుఁగున రామాయణమును రచించియుండఁగా మరల నీరామాయణము నేలవ్రాయవలసి వచ్చెనని కొందఱు శంకింపవచ్చును.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



"యది క్షుణ్ణం పూర్వై రితి జహాతి రామస్యచరితం
గుణై రేతావద్భి ర్జగతి పునరన్యో జయతి కః?"

పూర్వకవులచే క్షుణ్ణముగా వ్రాయబడిన దని రామ కథను విడిచిపైచినయెడల సకలకళ్యాణ గుణాభిరాముఁడగు రామునికంటె అన్యుఁడగు ధీరోదాత్తనాయకుఁడు మరియొకఁడు జగమున నెవ్వఁడు కలఁడు?" అని మురారికవి చెప్పినట్లు రామ చంద్రునికథ నెవరెన్ని విధముల వర్ణించినను రమణీయముగా నుండుననుట నిర్వివాదాంశము కాబట్టియే సర్వోత్తమనాయ కుఁడగు శ్రీజానకీనాయకుని వర్ణింప మనసు పొడమి యీ ప్రబంధరచనకు సాహసించితిని.

రామాయణ గాథలో గలనీతులు సకలలోకమున కవశ్యాచరణీయములైన రీతులని వేఱుగా నుడువ నవసరము లేదు కదా?

శ్రీరాముని పాత్రవలన పితృవాక్పరిపాలనము ఏకపత్నీ వ్రతము, శరణాగతత్రాణపరాయణత, దుష్టసంహారము, శిష్ట పాలనము మున్నగు నెన్నియో గుణములు గ్రహింపదగియున్నవి

సీతాదేవిపాత్రవలన పాతివ్రత్యమహిమ, కష్టశోక సహిష్ణుత, మున్నగుసాధ్వీగుణములు వ్యక్తములగుచున్నవి.

భరతసౌమిత్రుల పాత్రలవలన పరస్పరభ్రాతృధర్మ ములు సువ్యక్తములగుచున్నవి.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



ఇత్యాది మహాదాదర్శ ధర్మములను పదేశ దేలోకమున కందఁజేయుట యత్యంతావశ్యకములనెడు విశ్వాసముతో నేనీ పవిత్ర రామకథను వ్రాసి యాత్మసంతృప్తిని పొందగలిగితిని. "సర్వేజనాస్సుఖినోభవంతు" జయహింద్

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : (లేచి) రుద్రయ కవీంద్రులు తమనిరంకుశోపాఖ్యాన కావ్యకథాసారాంశముఁ జెప్పెదరు.

రుద్రి : (లేచి శ్రీకృష్ణ దేవరాయాభిముఖుఁడై)

నేనునిరంకుశోపాఖ్యానంబను ప్రౌఢ ప్రబంధమును రచించి కందుకూరిసోమేశ్వరస్వామి కంకిత మొసంగితిని.

కథానాయకుఁడైన నిరంకుశుఁడు పవిత్రమైన విప్రకుంబమున జనించి, వేదవేదాంగములు, షడ్దర్శనములు, మున్నగు శాస్త్రముల నధ్యయనము జేసియు, యౌవనముప్రాదుర్భవింపఁగనే మదనవికృతులకులోనై, సదాచారసంపత్తికి నుద్వాసము జెప్పి, వారనారీపరాయణుఁడై పతితావస్థను పొందెను.

తల్లియెన్నివిధముల హితోపదేశముచేసినను ధర్మపత్ని యెంతవిలపించినను సరకుసేయక యారేయి నిద్రాపరవశయైన భార్యయొడలినగలన్నియు నొలుచుకొనిపోయి, కోచెల్వ కర్పించెను. క్షీణవిత్తుఁడై నిరంకుశుఁడు వేశ్యమాతచే నెట్టబడి

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



యింటికిపోక, యడవికిఁబోయి యచటనొకచో శివలింగము గాంచి నాతోఁజూదమాడుమని కవ్వించి, యందులకు మారు పల్కలేకున్నందుకు నుభయపక్షముల తానే నిష్పాక్షికముగా జూదమాడి, యందులకుఁ బన్నిదముగా రంభను గోరి గెల్పు పొందెను, పిదప రంభనునాకిమ్మని తనయుత్తరీయమును శివ లింగమునకుఁ జుట్టి, లాగఁదొడఁగెను శివుఁడాతని సిష్కపట చర్యకు మెచ్చి ప్రత్యక్షమై, యింద్రునొప్పించి రంభను నిరంకు శున కిప్పించెను.

కొన్నాళ్లకు నారదుఁడు రంభానిరంకుశులు భూలోక ములోఁ గ్రీడించుట యెఱింగి యింద్రునితో రంభ భూలోక సౌఖ్యముల నాశించి నీకుఁ దలవంపులు చేయుచున్నదని చెప్పగా నింద్రుఁడు రంభనుపిలిపించి, కోపించి శిలవై పొమ్మనిశపించెను.

రంభభీతిల్లి శాపమోక్షపరికారమడుగగా నింద్రుఁడు దయదలచి, యాశిలను పొడిగాఁ చేసిన శాపవిమోచనమగు నని చెప్పెను.

రంభ నిరంకుశుని కడకు మగిడివచ్చి, యాయుదంత మంతయుఁజెప్పగ నాతఁడు రంభతోనీశాపమును నేను తొల గింతునని మాటయిచ్చెను. రంభశిలయయ్యెను.

పర్వతోపమానమైన యాఱాతిబండను జూచియందఱు బెగడొందిరి.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



శత్రుంధమనుండను నొక రాజాశిలను జూచుటకు వచ్చి, యచ్చట నొక చెట్టుపైనున్న బ్రహ్మరాక్షసునిచే నావేశింపఁబడి వికృతిచేష్టలు చేయఁదొడగెను. మంత్రికృతప్రయత్నములు వమ్ములయ్యెను. అప్పుడు నిరంకుశుఁడు వచ్చి నేనీబ్రహ్మరాక్షసునిఁదొలగింతును మీరీశిలనుచూర్ణము చేయుఁడని చెప్పగా మంత్రి శిలనుచూర్ణము చేయించెను.

తదనంతరము రంభ 'శాపవిముక్తురాలై యింద్రుని కడకుఁ బోగా నతఁడు నిరంకుశుని ప్రభావము నెఱింగి జూదమున శివుని గెల్చి మెప్పించిన యాతనిఁ జూడవలయునని నిరంకుశుని కడకు వచ్చి ప్రశంసించి, యాతనికోర్కె ప్రకారము శత్రుంధమనుని శాపవిముక్తునిఁ జేసి రంభతోఁ బూర్వరీతిగా భోగముల ననుభవింపుమని, యామె యప్పుడప్పుడు భూలోకమునకు వచ్చుచుండు నని, చెప్పి వెడలిపోయెను.

తరువాత నిరంకుశుని తలిదండ్రులు కుమారుని మహిమలకు నానందభరితులైరి. రంభయు దేవకాంతయగుటచేఁ జిరకాలము భూలోకములో నుండరాదుగనుక, వచ్చుచుఁ బోవుచు నిరంకుశుని సంతుష్టునిజేసినది. జయహింద్.

(నమస్కరించికూరుచుండును)

తిమ్మ : పింగళసూరనకవిశేఖరులు తమ కావ్యత్రయ కథా సారాంశములను జెప్పెద్రరు.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



సూరన: (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

అనల్పామృతకల్ప కల్పనా చాతురీధురీణుండనై, విద్వజ్జనప్రశంసాభాజన సమీచీనగుణసమలంకుర్యాణ ప్రౌఢప్రబంధ నిర్మాణ వైఖరీపారీణుండనై, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నమునను సర్వోత్తమ ప్రబంధరాజములను, రామాయణభారతకథల రెండింటిని జతకూర్చి రచించిన శ్లేషకావ్యమగు రాఘవపాండవీయమును రచించితిని.

కళాపూర్ణోదయమున అపూర్వకల్పనలతో కలభాషిణీ మణికంధరులు, సుగాత్రీశాలీనులు, బ్రహ్మసరస్వతులు, రంభానలకూబరులు, మున్నగుపాత్రలచిత్రణంబున నత్యద్భుతకథా సన్నివేశములచేఁ బాఠకుల నాశ్చర్యానందపరవశులఁ గావించు ఘట్టము లెన్నో కూర్పఁబడినవి. అందందుఁ దత్తదుచిత నీతులును బొందుఁబరుపఁబడినవి.

రెండవప్రబంధమగు ప్రభావతీప్రద్యుమ్నమునందుఁగూడ ప్రభావతీప్రద్యుమ్నుల విరహవర్ణనాదులును, శుచిముఖియను హంసి యఘటనఘటనా పటిమయు, మున్నగుఘట్టములు సహృదయహృదయాహ్లాదదాయకములుగాఁ జిత్రింపఁబడినవనుట యెల్లరకుఁ దెల్లమే కదా?

ఇంక శ్లేషకావ్యమగు రాఘవపాండవీయములో రామాయణభారతగాథలు రెండు నెట్లు పొందుపరుపఁబడినవో తద్గ్రంథ

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



పరిశీలన గావించిన మనీషులకు సువ్యక్తమే. మచ్చునకొక్క యుదాహరణము—

"ఏనుంగని కరమరయక" (రామాయణార్థము) ఏనుఁగనుకొని యెంతమాత్రి మాలోచింపక. (భారతార్థము) నేనును దయ పూనక-ఇట్లుసభంగాది శ్లేషలతో నించుమించు కావ్యమంతయు రెండర్థంబులు వచ్చునట్లు వ్రాసి రసజ్ఞజనాదృతిఁ బడసితినని చెప్పకొనుట చర్వితచర్వణమే కదా!

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : (లేచి) రామరాజ భూషణకవులు తమ వసుచరిత్ర కావ్యకథా సారాంశమును జెప్పెదరు.

రామ : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

నావసుచరిత్ర ప్రబంధమునకుఁ గథానాయకుఁడు వసు రాజు, కథానాయిక గిరికాదేవి.

శుక్తిమతి యొకనది ఆనదినే శబ్దచమత్కారములతో నదిగా, స్త్రీగాఁ జిత్రించుకొన్నాడను కోలాహలుఁడొకకొండ అతనినే కొండగా రాజపుత్రుఁడుగాఁ బాత్రప్రతిష్ఠ చేసినాడను నాశుక్తిమతి నలువ కొలువునకేగి మరలి వచ్చుచుండఁగా నా కోలాహలుఁడు నలువకొలువునకేగుచు నెదురయినాఁడు శుక్తిమతి వినయముతో నోరవైచనినది.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



అప్పటినుండి నాకోలాహల ధరాధీశ పుత్రునకు విరహము కలిగినది. అతఁడొకనాఁడు శుక్తిమతిని జేరి యామె చేసిన పూజలు గ్రహించి "ఓశుక్తిమతీ! నీ నెయ్యములు పూర్వజన్మకృతములు కాఁబోలును. నాకు నీపైఁగల ప్రేమ నెఱిఁగికూడ నన్నొకమాఱును బల్కరింపకయే నీవు గబగబ ఓరఁజేసికొని వెడలిపోవుదువు. కాని నేనో నిన్నుఁజేరుటెట్లు? ఒక్కమాట. విమల మధుర మనోహర వృత్తితో వెలయు వారిని గొనియాడునిమిత్తము బుధులెంతదూరమైన వెళ్లుచుందురు అందుచే దూరమనక నీపొందుఁగోరి వచ్చినాఁడను.

అతనిమాటకు నాశుక్తిమతి కలఁగినది వినయముతో భయముతో నిట్లన్నది గిరిరాజపుత్రా! మాకు నిలువెల్ల నీచాతినీచోపసరణముగలది. ప్రకృతిజాడ్యమైనది. పెంపు గాంభీర్యమాన విహీనమైనది. అంతరము పంకావిలము జీవనము బుద్బుదప్రాయము గమనము కుటిలపరికారము. ఉత్సేకములు భంగాకులములు. నిలుకడ యుండదు. తావులు పొలసు కంపు. ఇట్టమాబోంట్లతో అచలితోత్తుంగ ధైర్యుఁడవు అలఘుమతివి- అనఘుగ్ణతివి- అభంగశీలుఁడవైన నీకెట్లుపొసఁగును? అదిగాక అచలేంద్రుడెక్కడ? జడవాహిను లెక్కడ? మనకు సఖ్యమేమిటి? పొడవడరు మీయెడ మారసములెట్లెక్కును? అని నాశుక్తిమతి పలికినది.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



వెంటనే కోలాహలుఁడు చిన్నవోయి "శుక్తిమతీ! నీ కాంతిధారలో మునింగితిని. దయతో రక్షింపక నుల్లఁబెట్టెదవో! గ్రుచ్చిమెత్తి యానందముతోఁ దెప్పలఁ దేల్చెదవో" యని యన్నాఁడు.

అయ్యయ్యో! కామోద్రేకమున గౌరవోన్నతులు చెఱచుకొనకుము. మావంటి జడులలోఁబడి తెప్పలఁ దేలినచో మీకులగిరి కోటిలో లఘుత్వమువచ్చు నని శుక్తిమతి వెల వెలఁబారి పలికినది. ఇట్లే! సంభాషణ మంతయు నాశుక్తిమతీ కోలాహలులకు నడపినాను. తుదకు కోలాహలుఁడు బలాత్క రించి సుఖమనుభవించుటయు శుక్తిమతి వసుమహారాజు రక్షణ గోరుటయుఁ జూపెట్టినాఁడను.

వారిరువురకుఁ జన్మించినదియే నాప్రబంధ కథానాయిక గిరికాదేవి. ఆమెతల్లిని గాపాడి యామెను దుదకు వివాహ మాడిన వసుమహారాజే నాప్రబంధ కథానాయకుఁడు అతని చరిత్రమే నావసుచరిత్ర ప్రబంధము. జయహింద్.

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ: (లేచి) రామకృష్ణకవులు తమపాండురంగ మాహాత్మ్యము నందలి నృసింహక్షేత్ర మాహాత్మ్యకథాసారాంశమును జెప్పెదరు.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



రామ : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

కాళికావరప్రసాదలబ్ధ కవితాసారవిశేష విభ్రాజిష్ణుం డనై సాహితీసభలలో నెడనెడకవ్వించి, కడుపుబ్బనవ్వించు నాకవితాపరిసంగములు ప్రభులతోఁబాటు నందఱకు ననుభవైక విదితములే.

కళింగదేశాభరణంబగు పీఠికాపురంబున వేదశాస్త్ర పారంగతుఁడగు సభాపతి యొక్కఁడుండెను. అతనికి నిగమశర్మ యను నొక్కపుత్రుఁడుదయించెను. ప్రారబ్ధవిశేషముచే నిగమ శర్మ నామధేయ మతనియెడ నేతిబీరకాయ చందమయ్యెను. దుస్సాంగత్యచోదితుఁడగు నతని ప్రవర్తనకు దుఃఖించు తలి దండ్రులనూఱడింప, వచ్చి తనయక్క చేసిన సదుపదేశముల నాలించి బుద్ధితెచ్చుకొని యింటిపనులు సవరించుకొను వాని వలె నటించి నిగమశర్మ ఒకనాటిరేయి యింటిలోని ధనకనక ముల సంగ్రహించుకొని పారిపోయెను.

మార్గమధ్యంబునఁ జోరాపహృత సర్వస్వుఁడగుటయే కాక, గాయంబులు వడిన కాయంబుతోఁ జావుఁదప్పి యతఁడొక శూద్రుని కృపావిశేషంబుచే బ్రతికి యాతనియింట కొన్నా ళ్లుండి, కృతఘ్నుఁడై యాతనికోడలిని లేవఁదీసికొని పోయెను.

నిగమశర్మ యాజారిణియందుఁ బుత్రపుత్రికా సంతా నంబునువడసెను. పెద్దదగు సంసారంబును దిద్దుకొనుటకై

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



"భ్రష్టస్య కావాగతిః" అని మాంసాహార మలవరచుకొని, యొకనాడు వేటకేగి యింటికివచ్చుసరికి పుత్రికాపుత్రి సహితంబుగా నుంపుడుకత్తె యగ్నిదగ్ధగృహంబున మృతురాలై యుండుటఁజూచినాఁడు. హృదయవిదారకమగు నాదృశ్యమును గళ్లారచూచి మతిభ్రష్టుఁడై యాతఁడు నిరోభజనుండై బహుయోజనంబులు కాననంబునఁబోయి పోయి, నిశాచర వక్షఃపుటపాటనకఠోర నఖముఖుండగు ఖరసింహస్వామి వేంచేసియున్న పుణ్యప్రదేశంబు ప్రవేశించి పుడమింబడి విగతజీవుఁడయ్యెను.

ఎన్నిపాపములు చేసిన కుజనుఁడైనను నిగమశర్మ నృసింహక్షేత్రమునఁ బ్రాణంబులు చాల్పించిన కారణంబునఁ బరమపదప్రాప్తిని వడసినాడు. జయహింద్

(నమస్కరించి కూరుచుండును)

తిమ్మ : (లేచి ఆస్థాన చిత్రకారులు చిత్రకళా వైశిష్ట్యము గురించి చెప్పెదరు.

చిత్రి : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

లలితకళామయ! ప్రాణములులేని నాశిల్పములు ప్రాణులకు నీతిబోధకములు కాగలవు ఊపిరిపీల్చలేని నాశిల్పములు మానవహృదయములలో ననంతములైన యూహాలను గలి

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



గింపఁగలవు. సృష్టిలోనున్న ప్రతిప్రాణి కొంతకాలము జీవించును గాని? నాచిత్రములు చిరకాలజీవులు కాగలవు. శిల్పకళకు మానవజీవితమునకుఁ ద్రెంచుకొనలేని యవినాభావ సంబంధ మున్నది.

శిల్పిలేక శ్రీరామచంద్రుని కోదండము, అర్జునుని గాండీవము, శ్రీకృష్ణుని పిల్లనగ్రోవి, భీముని గదాదండము మనకు దృగ్గోచరములు కావు.

నాటి మహావీరులకీర్తి ప్రతిష్ఠలను నేడుకూడ మనము చూడఁగలుగుటకు కారకుడు శిల్పి, కరుడు గట్టిన హృదయములను ద్రవీభూతములను జేయువాడు శిల్పి.

సృష్టిలో లోపించిన సౌందర్యములను శిల్పి తన శిల్పములలోఁ జిత్రించి చూపింపగలఁడు. కవి తనకవితారీతులలోఁ బాఠకులను ముగ్ధులను జేయునట్లు శిల్పి తనకళాచిత్రిణచే స్వీయభావపరంపరలను ప్రదర్శించి రసానుభూతిని గలిగింపఁగలఁడు. కవులు చిత్రములజూచికదా? ప్రకృతిని యథాతథముగా వర్ణింపగలుగుచున్నారు?

(నమస్కరించికూరుచుండును)

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.



తిమ్మ : అవును చిత్రకళామూర్తీ! కదలలేని నీశిల్పములు చిత్రపటములు కదలుచున్న ప్రాణికోటికి నీతిని ధైర్యసాహసములను బోధింపఁగలుఁగుచున్నవి. నీఋణము నెవరుఁదీర్చుకొనగలరు! నీజీవితము ధన్యము. కాదు కాదు మాజీవితములుధన్యములు.

ఇంతటితో నేటికార్యక్రమము రాజగురువుల స్వస్తివచనములతో ముగించును.

రాజ : (లేచి శ్రీకృష్ణదేవరాయాభిముఖుఁడై)

స్వస్త్యస్తు సార్వభౌమస్య
కృష్ణరాయాఖ్య ధీమతే
విష్ణుచిత్తీయ సత్కావ్య
రచనాపూర్వహాస్య తే

తిమ్మ : తథాస్తు! (శ్రీకృష్ణదేవరాయలతోఁ బాటు సందఱు నిష్క్రమింతురు.

( తెర పడును )

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC LIBRARIES : ANDHRA PRADESH, HYDERABAD.

Rc No. 66-A3 / 66 Dt. 26-5-'66

Sub : Books and Publications-Book entitled "Veeradharmam" Recommendation of Orders Issued

Read : Lr Rc. No 3-D-2/66 dt 16-5-'66 from the Principal Govt. Training College, Rajahmundry.

The following book is Recommended for use in Public Libraries in the State.

| Name of Book | Name of author | Price |
| --- | --- | --- |
| Veeradharmam | A. Narasimha Murty | Re. 1-50 |

Copies can be had of Sri A. Narasimha Murty Hindi Pandit, Z.P.H. School, Velpur, W.G.Dt.

The undermentioned officers are requested to bring the above mentioned book to the notice of heads of all Public Libraries under their control.

K Raghava Reddy

For Director of Public Libraries

/ True copy / forwarded / by order /

Sd.

SUPERINTENDENT.

To

The Libraries of all Govt. Libraries in the State
The Secretaries of all Local Library Autorities in the State.

Copy forwarded to Sri A. Narasimha Murty, Hindi Pandit, Z.P.H. School, Velpur, W. G. Dt.

Copy to 'B' Section, Spare 5 Copies Record 3 Copies. M.N.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.

Funding: Tattva Heritage Foundation,Kolkata. Digitization: eGangotri.

శ్రీః

# సంస్కృతాంధ్రహిందీబోధిని

(ఆంధ్రనాగర్ లిపులతో)

ఇది సంస్కృతాంధ్రహిందీనామావళి, సంఖ్యావలి, సంస్కృతాంధ్రతత్సమతద్భవావళి, సంస్కృతహిందీతత్సమతద్భవావళి, అవ్యయావళి, క్రియావళి, సంస్కృతహిందీశబ్దరూపావళి, సంస్కృతహిందీధాతురూపావళి, సంస్కృతాంధ్రహిందీవ్యాకరణసూత్రావళి, సంస్కృతాంధ్రహిందీ సమాసావళి, త్రిభాషాశ్లోక పద్యలక్షణావళి, సంస్కృతశబ్దోత్పత్తినామావళి, త్రిభాషావాక్యావళి, సూక్తిశ్లోక పద్యరత్నావళి, మొదలగు ననేకవిషయములు కలిగి యుండును.

దీని సహాయమున ఉపాధ్యాయుల సహాయము లేకుండ తెలుగు చదువుట వ్రాయుట నేర్చినవారు రెండేడ్లలో సంస్కృతాంధ్రహిందీ భాషాసాహిత్యము నార్జించుకొని ధారాళముగా గవిత్వము వ్రాయుటయేగాక సంభాషణ సామర్థ్యమును సంపాదించు కొనగలుగుదురు.

6వతరగతి విద్యార్థి మొదలుకొని బి. ఏ. విద్యార్థి వరకు దీని సహాయమునఁ దమ విద్యాభ్యాసమును సరళము ఫలవంతము జేసికొన గలుగుదురు.

కృతికర్త
ఆముజాల నరసింహమూర్తి,
హిందీప్రచారక్, తోలేరు.

CC-0. Bhagavad Ramanuja National Research Institute, Melukote Collection.